కుర్రాడిని నిలబెట్టి, కొలతలు కొలుస్తున్నాడు, నా కప్పు డర్థంకాలేదు.”

మర్నాడు ఎల్లోరా రావడం, పాకలో మకాం, సూర్యాస్తమయం—

“అలిసివున్నానేమో—నిద్రపట్టేసింది.”

నల్లపిల్ల నగ్నదృశ్యంగురించి విడిచిపెట్టేసింది. అసలు ఆ పిల్లవిషయమే చెప్పలేదు. ఎల్లోరాగుహలు చూడ్డం, అక్కడి శిల్పాలనిగురించి, రాళ్ళనిగురించి అతను చేసినవర్ణన చెప్పింది. మర్నాడు పెద్దవర్షం—తను పాకలోనే వుండిపోయింది. అతను వర్షంలో తడిసివొచ్చాడు. తనకి జ్వరంవొచ్చింది.

“ఏదో మందు వేడినీళ్ళలో కలిపిచ్చాడు—బాగా నిద్రపట్టేసింది. ఉదయానికి నయమైంది.”

“చెక్కడం ఏమిటి?”

చెల్లెలు కనుబొమ్మలు ప్రశ్నార్థకంగా చిట్లించినప్పుడు మరీ అందంగా వుంటుంది. ఎత్తు మరో రెండంగుళాలు వుండి వుంటే, నిజంగా చెల్లెలు ఎల్లోరాలో నదీసుందరిలా గుంటుంది.

“రాతిమీద శిల్పం చెక్కుతాడట. ఒక పురుషుడు కూర్చున్నట్లు—అంతవరకూ చూశాను.”

“ఆయనకి శిల్పం ఏమిటి?”

“ఏమో, అక్కడెవరో ఆస్ట్రేలియాదొర వొకాయన దొరికాడుట. అతన్నిచూసి, నేర్చుకున్నాడట.”

ఇంకేముంది. మొన్నాడు ప్రయాణం. తనకేం తెలుసు?

అతనూ వొస్తాడనుకుంది. రాలేదు. దిగడిపొయ్యాడు. షూజాని సాయంగా పంపించాడు.

"వాడేడీ?"

"తిరుగురైల్లో వాళ్ళవూరెళ్ళిపోతాడుట."

"ఉత్తరం వ్రాయలేకపొయ్యావా?"

"టెలిగ్రాం ఇప్పించమన్నా. తిరగ్గొట్టేశాడు."

"ఎందుకు?"

"ఎందుకో మరి."

"ఇంకేంచెప్పారు?"

"కంగారుపడొద్దను. వారంలో వొచ్చేస్తాను అని చెప్పమన్నాడు."

"లేచెడుతూ మొగుడికి చద్దికూడు ఇష్టమని చెప్పిందిట." అన్నది నాగులు.

తనకి వో సామెత జ్ఞప్తికొస్తోంది—ఎక్కడా దొరక్కపోతే, అక్క మొగుడే దిక్కుట—ఎటొచ్చీ, ఇప్పుడు చెల్లెలి మొగుడు తనకి దిక్కు కాలేదుగా.

"ఎక్కడికి కెళ్ళివుంటారంటావ్ ? అసలు వొస్తారంటావా—నువ్వెల్లా విడిచివొచ్చావే?"

సమాధానం ఏంచెప్పాలో తెలీదు.

"ఇంక రైల్లోంచి దూకాలి."

నవ్వింది నాగులు.

"నే అనుకోడం, కలకత్తా వెళ్ళివుంటాడని."

"ఎందుకు?"

"అక్కడేదో శిల్పాలపోటీ ఏర్పాడుచేశారుట. తను

చెక్కినవి అక్కడికి తీసుకెడతాడేమో. ప్రతిమని కర్రపెట్టెలో పెట్టడం చూశాను."

ఇంకేమీ అడగలేదు. ఆరోజు గడిచిపోయింది. జ్ఞాన సుందరికి నిద్రపట్టలేదు. మధురంని దగ్గరగా లాక్కుని పడుకుంది. తన పోలికెక్కడుంది! మర్నాడు గడిచిపోయింది. చెల్లెలు కలకత్తాలో అన్నయ్యకి ముఖ్యప్రాణ్‌కి వ్రాసింది. అక్కడ కనిపించలేదని టెలిగ్రాంవొచ్చింది. అన్నయ్యేవొస్తున్నాడుట.

వొచ్చాడు. సంగతులు తెలుసుకుని మళ్ళా కలకత్తా ప్రయాణం అయ్యాడు. నాలుగురోజులు గడిచాయి. మధుసూధనం జాడలేదు. చెల్లెలి ఆందోళన ఎక్కువవుతోంది. రాత్రి తోటలో చెట్టుకింద కూర్చుంది. తనూ వెళ్ళింది. దీపం లేదు. చంద్రుడులేడు. చీకటిగావుంది. నక్షత్రాలు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి.

"ఇంకేంజరిగింది?"

ఏంజరుగుతుంది, ఏమి టా ప్రశ్న?

"ఏంజరుగుతుంది. అసలు నాతో సరిగ్గామాట్లాడందే. తిరగడం, రాళ్ళుపోగుచెయ్యడం, చెక్కడం. గడ్డంపెంచేశాడు... స్వేచ్ఛగా."

స్వేచ్ఛగా అన్నందుకు పెదవికొరుక్కుంది—నవ్వొస్తుంది. తనకి దిగులులేదేం? చెల్లెలికి తినమాటలో నమ్మకం కుదిరినట్లు లేదు.

"కలకత్తా వెడతాను. చాలారోజులైంది." అన్నది తాను. అల్లా ఎందుకంది? అనకూడదు. కలకత్తాలో మధుసూధనం వుంటే?

"నువ్వెడితే ఎట్లా. నేనేంకాను?"

"పోనీ వెళ్లనులే."

రెండురోజులతర్వాత, ఉదయం ఎనిమిదింటికి బండిలో దిగాడు మధుసూధనం. మనిషివాలకం వేరు. పాంట్, కోటు, కళ్ళజోడు—గడ్డంచేసుకున్నాడు. బండిలోంచి పెద్ద కఱ్ఱపెట్టె దించాడు బండివాడు. నాగరాజ్యలక్ష్మి. నవ్వుతూ ఆహ్వానించింది.

"క్షేమంగా వొచ్చారా?"

మధురభక్తి, నాన్నని కౌగలించుకుంది. ఏడుస్తోంది.

'ఏడుపెందుకే—వెఱ్ఱిపిల్ల.'

స్నానంచేశాడు. టిఫిన్ తీసుకున్నాడు.

"ఎక్కడనుండి రావడం?"

"ఆఫీసుకెడతాను. ఆ పెట్టిమాత్రం ఎవరూ తియ్యకండి."

"ఏం?"

సమాధానంలేదు. అతను వెళ్ళాడు. అమ్మాయి స్కూలుకెళ్ళింది. మధ్యాహ్నం భోజనంచేసి, మళ్ళా ఆఫీసు కెళ్ళాడు మధుసూధనం. అతనొచ్చాడుకనక, తనింక రాత్రి బండికి కలకత్తా వెడతానంది చెల్లెలితో. సాయంత్రం నాలిగింటికి కొచ్చేశాడు మధు.

రెండురోజులు కాంప్ వెళ్ళిరావాలిట — సామాన్లు సర్దుకుంటున్నాడు. పత్రికొచ్చిందా అని అడిగాడు.

ఇంకా రాలేదన్నది చెల్లెలు.

"ఈ పూటేగా వస్త—అప్పుడే కాంపా!"

అతనేమీ మాట్లాడలేదు. ఐదింటికి బైలుదేరి వెళ్లాడు. తను మళ్ళా కలకత్తా ప్రయాణంవిషయం ఎత్తింది చెల్లెలితో. అతను కాంప్‌నుంచి వొచ్చాంతర్వాత వెళ్ళొచ్చునంది.

ఆ రాత్రి గడిచిపోయింది. మర్నాడు సాయంత్రం ఆ పెట్టెగురించి అడిగింది.

"పెట్టెలో ఏముందో—ఎందుకు తెరవకూడదూ?" అన్నది నాగులు.

"నే వూహించగలను. అందులో రాతి విగ్రహం వుంటుంది—తీస్తే ఏమన్నా పగులుతుందని కాబోలు."

"అంత చూస్తేనే పగిలిపోతుందా - గాజుదికాదుగా."

"చూడొద్దంటే చూస్తాంకాదూ—అందుకని మనం చూసేదీ లేనిదీ పరీక్షచేద్దామని అల్లా అన్నాడు కాబోలు." అన్నది జ్ఞానసుందరి. తనిట్లాగనడం చెల్లెలికి నచ్చినట్లులేదు. మొహం చిట్లించింది.

"వారి వుద్దేశాలన్నీ బాగానే పసిగడుతున్నావు" అంది చెల్లెలు.

తనకి కోపం వొచ్చింది.

"అంటే?"

"ఏకాంతంగా పరిశీలించి, మనస్సు ఎట్లావుండేదీ వ్యాఖ్యానంచేసే అనుభవం..."

"ఏంమాట్లాటలవి నాగూ"

"మీరు గడపొచ్చు-నే అనకూడదు—పెళ్లాన్నేగా"

"ఊరుకో. అట్లాగంటే ఇక్కడుండను. ఈపూటే వెళ్ళిపోతాను."

"నువ్వెక్కడికి కెడతావులే!"

ఆయ్ అని కసిరింది. ఎంతమాటంటె అంతా అనేస్తోంది అక్కనేనా లేకుండా.

"నే నిప్పుడే వెడతాను."

అని జ్ఞానసుందరి, దొడ్లో ఆరేసిన బట్టలు తీస్తోంది తన పెట్టెమూత తీసి అందులో బట్టలు లుంగచుట్టి పడేస్తోంది. గడియారం నాలుగు గంటలు కొట్టింది.

"పెట్టెలో ఏముందో చూసి వెడుదువుగానిలే."

"నాకేం చూడాలనిలేదు. మీరు మీరు ఏమన్నాకండి."

పక్కచుట్ట సర్దుకుంటోంది.

"అందులో ఏముందో తెలుసుకాబట్టే, నీకు చూడాలనిలేదు." అన్నది చెల్లెలు.

"అను, అను. ఇష్టమొచ్చినట్లు అను."

"ఇప్పుడేమన్నానూ?"

చరచరా గదిలోకొచ్చింది జ్ఞానసుందరి. అట్లకాడ పట్టుకొచ్చి, పెట్టెకి చుట్టూకొట్టిన మేకులు పైకి లాగుతోంది. గబగబ ఒక్కొక్కటే వూడపెరుకుతోంది. మూల మరో రెండు వుండిపొయ్యాయి. బలంగా పైకి నొక్కిపెట్టి లాగుతోంది. పట్టుజారి మేకు వొంకరోయి చేతివేలికి గుచ్చుకుంది. రక్తం వొస్తోంది బొట బొట. చెల్లెలు గుడ్డపీలిక తెచ్చి

కట్టు కడుతోంది. తను విదిలించేసింది. రక్తం బొట్లు చింది ఆమె మొహాన పడ్డాయి.

ఇప్పుడు చూసుకో"

అని మూతలాగి గిరవాటేసింది. పెట్టెనిండా పాత గుడ్డలు, దూది, రంపంపొట్టు, చిత్తకాగితాలు పైన, చుట్టూ కప్పివున్నాయి. ఒక్కొక్కటీ పైకి లాగుతోంది. అన్నీ తీసేసింది. లోపల రాతి విగ్రహాన్ని పైకి లేవదీసి, మధ్యనున్న గుండ్రని బల్లమీద నుంచోబెట్టారు ఇద్దరూకలిసి.

అది మూడున్నర అడుగుల ఎత్తైన రాతి శిల్పం. మోకాళ్ళమీద కూర్చున్న పురుషుడు. ఉంగరాలజుట్టుతల — మోకాలు, మోచెయ్యి వంకరలు తిరిగివున్నాయి. దీనంగా చూస్తున్నట్లు, కళ్ళు పైన దట్టంగా కనబడే కనుబొమ్మలు, ప్రక్కన ఒక స్త్రీ నిలబడివుంది. ఒకచెయ్యి, అతని మెడ మీద బిగించివుంది. రెండో చెయ్యి పైకి లేచివుంది. చేతిలో గరిటెలాంటిది — ఇనుముది — వుంది. ఆమె మెడలో నగలు లేవు — ఏ ఆభరణమూ లేదు. గాజులు లేవు — నడుంకిచుట్టుకుని పరికిణీలా అంచులు, మడతలు తీర్చినట్లుగా చిత్రితమైన స్త్రీమూర్తి.

స్త్రీ ప్రతిమ మోహంలో గాంభీర్యం, గర్వం వున్నాయి. మూతిబిగించి కాఠిన్యాన్ని సూచిస్తోంది.

పురుషుణ్ణి బానిస చేసి, తానుపొందిన స్వేచ్ఛతో విర్రవీగుతున్నట్లు స్ఫురించే శిల్పం అది. ఇద్దరు పరీక్షగా చూశారు. చెల్లెలుకళ్ళంట నీరు తిరుగుతోంది. ఆమె పెద

వులు వొణుకుతున్నాయి. వేళ్ళు వొణుకుతున్నాయి. అవి కదలకండా, చేతులు బిగించి చీరకొంగులో దాచింది.

"నీ మొహమే."

అన్నది చెల్లెలు. తనకి భయమేసింది. అవునేమో అనిపిస్తోంది. ఆ శిల్పంలో ఒక లోపం తనకి స్ఫురించింది. పురుషుణ్ణి బానిస చేసి స్వతంత్రం పొందిన స్త్రీ మూర్తిని చిత్రించడం వుద్దేశమైతే, ఆమెమెడలో బోలెడన్ని ఆభరణాలుండాలి. సంపద సూచించాలి. ఇవి ఆ చిత్రంలో లేవు — తనకీ ఆభరణాలు లేవు. అదొక పోలిక - తనకి ఆరాత్రి నిద్రమందిచ్చి, పక్కచుట్టమీద ఆనించి కూర్చోబెట్టి, దీపం మొహం ముందు వుంచి, ఆమె స్వరూపాన్ని రాత్రంతా చెక్కుతూ గడిపివుంటాడు. లేకపోతే, తన పోలి కెట్లా వొస్తుంది ?

తనపోలికే వుందని ఎందుకనుకోవాలి ? అది భ్రమ. తను ఆ శిల్పాన్ని ప్రేరేపించిందనుకోవడంలో తృప్తి, అహం వున్నాయి. కాని చెల్లెలుకూడా అల్లాగే అంది. ఈ విషయంలో స్త్రీ ఎప్పుడూ పొరబడదు.

"అవునా?"

"ఏమిటవును?"

"మూడునిద్రలుచేసిన ఫలితం."

"ఛ, ఛ! ఎన్నిసార్లు చెప్పను? నీకు మతిపోయింది... అసలు ఏమీ—ఏదీ...జరగందే..."

"ఆయనరాగానే వెళ్ళిపోతానని ఎందుకంటావు...?"

చరచర హాల్లోకెళ్ళింది నాగులు. మళ్ళీవొచ్చింది. చీరకొంగులోంచి చెయ్యి బైటకిలాగింది. చేతులో సుత్తితో గబగబ శిల్పంమీద కొడుతోంది చెల్లెలు. తనడ్డపడింది. వారించింది. సుత్తి రెండోచేతిలో తీసుకుంది. మళ్ళీ స్త్రీ ప్రతిమమీద కొడుతోంది. గట్టిగా రెండుచేతులు పట్టుకుంది. ఆమె విదిలించివేసింది. వెనక్కితిరిగి మరో దెబ్బ కొట్టింది.

"వొద్దు, వొద్దు.నన్నుకొట్టు—నా నెత్తిపగలగొట్టు. దాన్నొద్దు—నాగు—నాగు..."

మరో బలమైనవేటుతో మొత్తంగా బొమ్మ కింద కూలింది. విరిగి ముక్కలైంది. స్త్రీమూర్తిచెయ్యి వూడింది. చేతిలో గరిట దూరంగా పడింది. పురుషుడితల పగిలింది. స్త్రీమూర్తినడుం విరిగింది. జ్ఞానసుందరి నడుంపైన రెండు చేతులూ బిగించి, కింద పడిపోయింది—నడుం విరిగినదానికి మల్లె.

హాల్లో అడుగులచప్పుడు. జోళ్ళు విడిచిన చప్పుడు.

"నాకు తెలుసు."

అని వొక పురుషకంఠం. మధుసూధనంది. చెల్లెలు మూలగా మంచంమీద పడివుంది. మొహాన కొంగు కప్పుకుని ఏడుస్తోంది. అతను హాల్లోకెళ్ళాడు. మళ్ళీ వొచ్చాడు. పగిలిన ముక్కల్ని ఏరుతున్నాడు.

"ఇన్నిరోజులుండడం విశేషమే." అంటున్నాడు. ఎవ్వరూ మాట్లాడరు.

"మీ అక్కయ్య పోలికను శిల్పంలో చిత్రించగల ప్రతిభాశాలివైతే కళాప్రపంచం బ్రహ్మరథం పట్టును."

నౌకరు లాల్‌గిరి పత్రిక తెచ్చాడు. మధుసూధనం ఆత్రుతతో పుటలు తిప్పుతున్నాడు. చదువుతున్నాడు. పూర్తయింది.

"ఇదిగో పత్రికలో చూడు" అని చెల్లెలికి పత్రిక అందిచ్చి చదవవల్సిన భాగంవైపు వేలితో చూపుతున్నాడు. కొంగు కళ్లకిందికిలాగి, వొణికిపోతున్న చేతులలో పత్రిక చూస్తోంది. పత్రిక చేతిలో వుండడంలేదు. అతను పట్టుకున్నాడు.

"చదువుకో."

చదివింది. తనూ లేచింది. దగ్గరగా వెళ్ళి మంచం బద్ది మీద కూర్చుంది. పత్రిక చూస్తోంది. ఆమెకేసి అతను దీనంగా చూస్తున్నాడు. చూపుతప్పించి చదివింది.

"వొస్తువు ఉదాత్తమైంది కాకపోయినా, శిల్పంలో చూపిన నేర్పుకి మధుసూధనంగారి 'నేటి స్వేచ్ఛ' అనే కంచులో పోసిన శిల్పానికి వెండిపతకం లభించింది. ఫైనార్ట్ సొసైటీవారి బంగారుపతకం..."

నాగరాజ్యలక్ష్మి లేచింది. తనని గట్టిగా కౌగలించుకుంది. ఏడుస్తోంది.

"నన్ను...నన్నొదిలివెళ్ళకు..."

మధుసూధనం నవ్వుతున్నాడు.

"ఇదెల్లానూ భగ్నమౌతుందని తెలిసే, ప్లాస్టర్ శిల్పం

పూర్తిచేసి, పూనాలో కంచులో పోతపోయించి కలకత్తా ప్రదర్శనకి పంపించాను. ఇంక ఇద్దరూ స్వేచ్ఛగా సాగించండి, నవ్వో ఏడుపో!"

వెళ్ళాడు. నాగరాజ్యలక్ష్మి నవ్వుతోంది. లేచింది. అతని వెనకాలె వెళ్ళింది. బైట మధురభక్తి పాడుకుంటూ రావడం వినబడుతోంది.

మొహాన్ని రెండుచేతుల్లో దాచుకుంది జ్ఞానసుందరి. అది ఏడుపో నవ్వో తనకే తెలియదు.

# తీర్పు చేసినవాడికే శిక్ష

ఆడపిల్లలకి పెండ్లిళ్లు కావడంలేదని తలిదండ్రులు వాపోవడం అందరూ ఎరుగున్నదే—మొగపిల్లవాడికి పెండ్లి కాకపోవడం అరుదు. బారిస్టర్ గారమ్మాయి నాగలక్ష్మి సంబంధం తనకి నచ్చలేదన్ననాటినుండి రమాకాంతం పెళ్ళి ఒక సమస్యగా పరిణమించింది. బారిస్టర్ గారమ్మాయి చాలా మంచిసంబంధం అని పెద్దలు నలుగురూ హామీ యిచ్చిన మీదనే వెళ్ళి చూడ్డానికి వొప్పుకున్నాడు రమాకాంతం. నాలుగైదేళ్ళుగా, డజనుపైగా సంబంధాలు చూసి నచ్చక విసుగెత్తిపోయ్యాడతను. ఈ సంబంధాలన్నీ మంచివే అంటూ వొచ్చారు పెద్దలు. కాని అదేం చిత్రమో అతనికి ఎవ్వరూ నచ్చడంలేదు; సీతారావమ్మ పెద్ద కట్నంతో వొస్తుంది కాని చదువు లేదు. కల్యాణి చదువుకుంది—స్కూలుఫైనల్ ప్యాసైంది, కట్నం దమ్మిడీ లేదు. పద్మకి రెండూ వున్నాయి—కాని అమ్మాయి నలుపు; ఎట్లాంటి నలుపంటే...వుపమానాలు చాలా ఖర్చుచేశారు. హైమవతికి కట్నం, చదువు, మంచిరంగూ మూడూ వున్నాయి—ఒక్కటే లోటు, పెద్ద ముక్కు, పొడుగూ వెడల్పూ. 'ఆలయంముందు ధ్వజస్తంభం' అన్నాడు రమాకాంతంతో సంబంధం చూడ్డానికి వెళ్ళిన సుబ్బారావు. కామాక్షికి ఏ లోటూ లేదు. ఎనమండుగురు ఆడపిల్లలలో ఎనిమిదవది. అక్కలందరికి వివాహాలైనాయి.

అందరూ పెద్దపెద్ద ఉద్యోగాలలో వున్నారు. అందరి ముందూ రమాకాంతం ఒక్కడూ నిరుద్యోగి—అక్కర్లేదు పొమ్మన్నాడు.

'అబ్బాయికి నచ్చితేనేగాని పెండ్లి చెయ్యను' అన్న తండ్రి సూత్రంపై రమాకాంతం కోర్కెలు, ఆదర్శాలు పెంచుకుంటూ వొచ్చాడు. 'మావాడికి నచ్చాలే' అన్నారు గాని, ఏ విషయంలో నచ్చాలో నిర్ణయించకపోయినా, రమాకాంతం ముఖ్యంగా చూసేది, పిల్ల చక్కదనం. పైకి అందంగా వుండాలి, సౌందర్యం సహజంగావుంటే మిగత అన్నిలక్షణాలు ఎల్లానో అల్లా తెచ్చుకోవొచ్చునని, చాలామంది యువకుల వలె రమాకాంతం నమ్ముతున్నాడు. చదువు చెప్పించవచ్చు; డబ్బు తను గడిస్తాడు; నాట్యం, సంగీతం నేర్పించవచ్చు. ఫాషన్స్, ఎటికెట్, 'చార్మింగ్ మానర్స్' యివన్నీ సహవాసం వల్లనే వొస్తాయి. అందాన్నిమాత్రం ఎవరూ తెచ్చుకోలేరు—అంటాడతను.

ఇల్లా కోరడానికి రమాకాంతం చక్కటివాడంటారా? అసలు మొగాడి చక్కదనంగురించి ఎవరు పట్టించుకుంటారు? పట్టించుకుంటే ఆడపిల్లకి వివాహమవుతుందా? అసలు ఆడపిల్లకి ఆరకం ఆలోచనలు, వుద్దేశాలు వుంటాయంటారా? 'కుర్రాడి మొహం కళగానే వుంటుంది'. 'ఒడ్డూ పొడుగూ—నిండుగా బాగానే వుంటాడు'. 'మంచి వర్ఛస్సుంది, బాగానే వుంటాడండి'.

"కుర్రాడికేం దివ్యంగానేవుంటాడు. కండ్లకి జోడంటారా, అది యీరోజుల్లో ఫాషన్. అందరికీవుంది." ఈ విధంగా పెండ్లికున్న వ్యక్తి రూపు లావణ్యాలకి విలువలు కడు

తుంటారు. అన్ని విలువలలోనూ కనిపించేది వొకటుంది— 'బాగానే వుంటాడులో 'నే' అన్నది. దాన్నిబట్టి ఆ విలువల పట్ల ఎంత గురి, నమ్మకం వున్నాయో మనం ఊహించుకో వొచ్చు.

అంటే రమాకాంతం అనాకారి అని కాదు. బాగానే వుంటాడు; పోనీ 'నే' తీసేసి 'బాగా' వుంటాడు అనొచ్చు. నిండైన గుండ్రటిమొహం, ఉంగరాలజుత్తు, లేతపెదవుల చిన్ని నోరు, తీర్చినట్లుగా వుండే కళ్ళు, చామనచాయ, జాలిగొల్పే మొహం, మొత్తంమీద ఆకర్షణీయంగానేవుంటాడు. అదుగో మళ్ళా ఆ 'నే' వొచ్చిపడిందనుకోండి.

చదువుకున్నవాడు, తెలివైనవాడు, మంచికుటుంబం, 'రాజాలాంటి జాతకం'—అతను చాలా చక్కనిపిల్లని కోర డంలో ఆక్షేపణలేదు. చాలా చక్కనిపిల్లని కోరని యువకుడు సమాజంలో వున్నాడా? 'ఈ సినిమాలంటూ వొచ్చిం తర్వాత చక్కదనాన్నిమాత్రమే చూస్తున్నారండి యీనాటి కుర్రకారు' అని పెద్దలు అరుగుమీద చుట్టకాలుస్తూ చెప్పు కుని యిదవడం ఎవరికి తెలీదు!

సంబంధాలు చూసినకొద్దీ అతని ఆదర్శం మారుతూ వొచ్చింది. బారిస్టర్‌గారమ్మాయి సంబంధం వొచ్చినప్పుడు, ఇది తప్పకుండా వొప్పేసుకుంటాడనీ, నచ్చితీరుతుందనీ నలు గురూ నిశ్చయించుకున్నారు. అది అంత మంచిసంబంధం. ఒక్కత్తేకూతురు. చదువుకుంది, మంచికుటుంబం; పలుకుబడి, హోదా వున్నాయి. అన్నింటికంటె ముఖ్యమైంది ఒకటుంది. నాగలక్ష్మి బాగుంటుంది. నాజూకైనమొహం, శరీరం, ఆకర్ష

ణీయమైన అవయవాలకూర్పు, బంగారం ఛాయ, పెద్దజడ, సొగసైన నడక, మధురమైన కంఠస్వరం—సంస్కారంగలది. ఆమెలో చాలా అమిరాయి. ఎంతో అదృష్టంగల వ్యక్తికి గాని అల్లాంటిపిల్ల దొరకదన్నారు. నాగలక్ష్మి ఆ సంబంధానికి ఒప్పుకోడంకూడా విశేషం అన్నారు. తను ఆ అమ్మాయికి నచ్చాడంటే రమాకాంతం చేసుకున్న పుణ్యంగా భావించవచ్చునన్నారు. అయినా, ఈ సంబంధంఎల్లా ఒప్పుకుందబ్బా! ఏ ఐ. సి. యస్. (ఆ రోజుల్లో) ప్యాసైనవాడో తన్నుకుపోతాడుకదా– 'ఎందుకీతొందర సుందరాకారా'.

రమాకాంతానికి అమ్మాయి నచ్చింది. కాని చాలా మంది అమ్మాయిలను చూడటంవల్ల ప్రతీ అమ్మాయీ తనకి దొరికిపోయినట్లు, తన అధీనంలోకి వచ్చేసినట్లు మానసికంగా అంగీకరించి 'కావాలి', 'వద్దు' అని తీర్పుచేసే మనస్తత్వం అతని కేర్పడిపోయింది 'నాకు నచ్చలేదు' అని తన తీర్మానాన్ని బహిర్గతం చేసినప్పుడు ఆ అమ్మాయీ, ఆ అమ్మాయి తాలూకు బంధుకోటి తనను నచ్చి బ్రతిమలాడతారని, ఒక చులకనైన తృణీకారభావం అతనికి అలవాటైపోయింది. నిజంగా అతనికి నచ్చినా పైకి కాస్తో, కూస్తో నచ్చనట్లు అనేసేస్వభావం కూడా ఏర్పడేస్థితికి వచ్చాడు రమాకాంతం. నాగలక్ష్మిని చూడ్డానికి వెళ్ళినప్పుడు ఈ మనస్తత్వమే బయటపడింది అనుకోవాలసివస్తుంది. "కాస్త మెల్లకన్నేమో" అని ఎవరితోనో అన్నాడుట. అల్లాగ అన్నాడేకాని "నాకు నచ్చలేదు, ఈ సంబంధం వద్దు" అని అనలేదు. కాని అతను ఏమరిపాటున చేసిన వ్యాఖ్యానం నాగలక్ష్మి చెవులకి సోకింది. మరి తర్వాత

ఏంజరిగిందో ఎవరికీ తెలియదు. అతనే వద్దన్నాడో, ఆమెకే నచ్చక వద్దన్నదో తెలియదు; మొత్తానికి ఆ సంబంధం పెసిగిపోయింది. నాలుగైదు నెలల్లోనే నాగలక్ష్మికి మరోసంబంధం వచ్చింది. భర్తకి ఎక్కడో ఉద్యోగం. భర్తతో వెళ్ళిపోయింది.

ఆమెకి వివాహం అయిందని తెలుసుకున్నప్పుడు రమాకాంతం కొంత బాధపడ్డాడు. ఆమెభర్త వుద్యోగికావడం ఈ బాధకి కొంతకారణం. ఇతను చూడలేదు కానీ అతను 'స్ఫురద్రూపే'అని చెప్పుకున్నారు. నిజానికినాగలక్ష్మిఇతనికినచ్చింది. ఆ అమ్మాయి అతనికేసి కోరగా చూసిన విధానమూ, ఆహ్లాదంతో వికసించినచూపూ-ఏమిటో మొగ్గపండైనట్లుగా,నక్షత్రంతో కచుక్కైనట్లుగా-శీలాన్ని సూచించే స్ఫుటమైన వాక్కు-చిందరవందర పరిసరాలను చీదరించుకునేకళాత్మృష్టికిచిహ్నంగా అలంకరణ, నిర్మలమైన నీటిగుండా లోతుకి సోకిన సూర్యకిరణానికి వెలిగి మెరిసిన స్వచ్ఛమైన ఇసుకరేణువుల పరంపరలో మసిలే కాంతివంటి శరీరచ్ఛాయ. ఇవన్నీ మంచుముద్దపై చెయ్యి వేసినట్లు, నిప్పులో వేలుపెట్టినా కాలనట్లు వింత అనుభూతిగా అతనిమనస్సులో నిలిచిపోయాయి.'మెల్లకన్నే మో'అన్నాడు. చాలా అందమైన వస్తువులో స్వల్పమైన లోపాన్ని అతిశయోక్తిగా చెప్పడంకూడా ఒకరకం ఆరాధనే. నల్లటి కనుబొమ్మలు, మెట్లవరసలా: కత్తులబారులా, క్రమమైన నీడను ప్రసరించే కనురెప్ప వెనక నల్లటిగ్రుడ్డులో ఎక్కడో నలుపు రంగు కరగి ఊదాపాపగా పల్చగా తేనె పాలలోపోసినట్లు నలుపులో చిక్కదనం లోపించిన ఆమెకళ్ళ అందంలోని ఒక

అందమైనలోటుని అతిశయోక్తిగా చిత్రించి వ్యాఖ్యానించడం పొరబాటని గ్రహించాడు రమాకాంతం. ఇక యిప్పుడు చేసే దేమీలేదు. ఆమె మరోసంబంధం చూసుకుని భర్తతో వెళ్ళి పోయింది. తనూ అదే చెయ్యాలి. అతనికోరిక ఫలించదని మనస్సులో ఒక బెదురు నిలిచిపోయింది. ఎందరు ఎన్నిసంబంధాలు చెప్పినా, చూడాలన్న కుతూహలం కుంటుపడింది. అవేవి బాగుండవనీ అతనికి నచ్చవనీ ముందే అతనికి తెలుసు. అయినా చూడకతప్పదు. ఏవో రెండుమూడు చూశాడు. అతనికి బొత్తిగా నచ్చలేదు. ఆంధ్రవనితలలో ఎక్కడో నూటికి, కోటికి ఒకరు తప్ప అసలు చక్కనివాళ్ళంటూ లేరని తీర్మానించుకున్నాడు. లభ్యమైన తెనుగుకన్య సౌందర్యం నచ్చకపోవడం అతని దౌర్భాగ్యం అనుకున్నాడు. అతనిలో పెర్షియా, యిరాన్, యిరాక్, ఈజిప్టు దేశస్థుల రక్త మున్నదా? పోలెండు, డెన్మార్కు, హంగెరీ, ఫ్రాన్సు జాతుల జీవితకణములు అతని పూర్వీకులనుండి దాపురించి నవా? తనవాళ్ళల్లో నాగలక్ష్మిలాంటివారిని మినహాయిస్తే ఏ కన్య అయినా అతనికి నచ్చుతుందో లేదో అతనికే తెలియదు.

ఆ సంవత్సరమే అతనితల్లి చనిపోయింది. సంబంధాలు చూసే వొత్తిడి కొంత తగ్గింది. తండ్రి కోర్కె ప్రకారం రెండేళ్ళలో నాలుగు సంబంధాలు చూశాడు. మరో ఏడాది గడిచాక సంబంధాలుకూడా రావడంలేదు. 'ఇతనికి ఏ అమ్మాయీ నచ్చదురా' అనే ఒక వదంతు సమాజంలో కన్యాదాతలద్వారా ప్రచారంలోకి వచ్చినట్లు నలుగురూ

కూడబలుక్కున్నట్లూ, పిల్లనిస్తామని వచ్చినవారు లేరు. ఇతని శ్రేయస్కాములు ప్రాధేయపడి బలవంతంచేయగా ఆ ఏడాది రెండుసంబంధాలు వచ్చాయి. ఒకమ్మాయికి చెముడు, మరో అమ్మాయికి ఏ లోటూ లేదు కాని అప్పగారు పిచ్చది. తర్వాత రెండుసంవత్సరాలూ అసలు ఒక్క సంబంధంకూడా రాలేదు. తన బంధుకోటిలోవున్న సూర్యకాంతం, పద్మావతీ, వాణీలకు పెండ్లిండ్లయిపోయాయి. తండ్రికి పక్షవాతం వొచ్చింది ఉన్నకా స్తుకూమిని అప్పులవాళ్లు లాక్కుపోయారు. మిగిలిన ఆస్తిమీద రాబడినంతా ఉద్యోగయత్నాలకోసం ఖర్చుపెట్టాల్సివొచ్చింది. తండ్రివైద్యానికి మరికొంత ఖర్చయింది. అవకాశం వున్నప్పుడల్లా ఉద్యోగంకోసం వూళ్ళమ్మట తిరిగొస్తున్నాడు. ఆఖరుకి వొక ఉద్యోగందొరికింది అది అతనికి నచ్చకపోయినా, వోపికతో రెండేళ్లు ఆ ఉద్యోగంలోనే వున్నాడు. అతని సమకాలికులందరూ పెరిగి పెద్దవాళ్ళవటం చూసి అతను ఆశ్చర్యపడ్డాడు. సూర్యకాంతానికి అప్పుడే యిద్దరుఆడపిల్లలూ,ఒక మొగపిల్లాడుట. వాణీమూడోకుర్రాడు అయిదోక్లాసుట. పద్మావతి పెద్దకూతురు నాట్యం నేర్చుకుంటూ బాలబాలికల సభలలో ప్రదర్శనాలిస్తోందిట. తన స్నేహితులందరూ ఏవో వుద్యోగాలు చేస్తూవున్నారు. దాసిని చెక్కలా సన్నగావుండే గురవారెడ్డికి పెద్దబొజ్జ. రాఘవయ్య నాయుడికి బట్టతల. లక్ష్మీకాంతానికి గెడ్డంకిందగెడ్డం. అద్దంలో తనముఖం చూసుకోవాలన్న అభిలాష సన్నగిలింది రమాకాంతంలో. తనేమైపోతే ఎవరిక్కావాలి తన కేమిజరిగిందో తనకే తెలియనప్పుడు. మరో ఏడాదికి తండ్రి మరణించాడు.

అతను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. తండ్రి కాలం
చెయ్యడంతో గతంనుండి విముక్తుడయినట్లు స్వేచ్ఛని మాన
సిక ఔన్నత్యాన్ని సంపాదించుకుని నడివయస్సు భవనంలో
రెండు కాళ్ళూ పెట్టి గుమ్మం ఎదురుగుండా మునిసిపాలిటీ
చెత్తడబ్బాని తన జీవితంలో ఒక భాగంగా అంగీకరించి తనకు
తాను సమాధానపడి సమాజంలో స్థానం ఏర్పరుచుకోవ
డానికి ప్రబలమైన యత్నాలుచేస్తూ పట్నం చేరుకున్నాడు
రమాకాంతం. అక్కడేదో ఒక వుద్యోగం, దానికోసం ఒక
రికో ఇంటర్వ్యూకి సిద్ధపడ్డాడు. సాయంత్రం 'రంజనీభవనం'
లో ఏదో గొప్ప నాట్యప్రదర్శనంట. అతనికి వెళ్ళాలనిపిం
చింది. పద్మావతికూతురు జ్ఞాపకంవచ్చింది. ఆనాట్యం చూసి
ఆనందించలేనని అతనికి తెలుసు. మనస్సు ఎటోఎటో పోతుంది.
కాని అట్లాంటి అందమైన ఒక నాట్యప్రదర్శనం ముందు తన
మనస్సు ఎటో ఎటో పోవడం, దాన్ని పట్టుకుని మళ్ళా ఇటు
లాక్కురావడం, అది మళ్ళా అటూ అటూ పోవడం—
అందులో ఏదో వుంది, ఆనందం కాబోలు. బాధలో ఆనందం
పొందాలన్నా కొంత డబ్బు ఖర్చవ్వాలి. వెళ్ళాడు. అది చాలా
అద్భుతమైన నాట్యప్రదర్శన. ఆ సెట్టింగు అంతా ఇంద్ర
లోకంలాగ వుంది. వారి రంగులదుస్తులు, వయ్యారమైన కద
లికా, జుగుప్సకలిగించే ఢోలక్ నాదాలు, మంచు శిఖరాల
ముందు శివ పార్వతుల నాట్యం జరుగుతున్నప్పుడు నలు
మూలలా అగ్నిలా నాలుకలు చాచిన సర్పాలు మంచు కరిగి
వరదలై జారినట్లు, పార్వతి చీరకొంగు తెల్లమడతలు సము
ద్రపు అలలుగా చందమామని కావలించి అలలు నురగలై

నింగి కెగసినట్లు—అడవులను విడనాడి దోవతప్పి ఎడారిలో ఒంటిగా తిరుగాడుతున్న ఆ పులిచర్మం క్రిందకు జారినప్పుడు మృదంగాల లయకు కదిలిన కండల నాట్యతీరువూ—పార్వతి సౌందర్యాన్ని చూడలేక కళ్ళు పీకేసుకున్నట్లు రెండుకంతలు, ఆనందంతో నవ్వలేక పళ్ళూడగొట్టుకున్నట్లు నోటి వెనక కంత, భీభత్సంగా ప్రదర్శించిన శివుని మెడలో పుర్రెలమాల,- అంత సౌందర్యంలో అంత ఆనందంలో అంత మొందడమే మానవుడి పరమావధి అయినట్లు ఆ స్వర్గంలో ఆ స్మశానం. చలికి నిండుగా ముసుగుపెట్టుకున్న ప్రకృతిమధ్య ఆ నగ్న శక్తుల నృత్యమూ సన్నగిలి దిగజారుతున్న ప్రాణి కణాన్ని ఒక్క క్షణం లాగిపట్టి, బ్రద్దలుకొట్టి, ఒక పెద్ద సౌందర్య జ్వాలగా ప్రజ్వలింపజేసి, ఆనందసాగరంలో ముంచి ఆద్యంతాలును, భూమ్యాకాశాలును ఏకంచేసి ముడిపెట్టి రెండు చేతులు జోడించి ఒక్క నమస్కారంపెట్టినట్లుగా రమాకాంతం మనస్సు అటూ అటూ పోవడం మాని, అక్కడే జీర్ణించి స్థంభించి శిథిలమయింది.

ఇంటర్వల్‌లో బైటకొచ్చి అటూ యిటూ తిరుగుతున్నాడు. చిన్ననాటి స్నేహితుడు రంగాచార్యులు కనిపించాడు. కూల్‌డ్రింక్ తాగుతున్నాడు. అతను రమాకాంతాన్ని గుర్తుపట్టలేదు. ఇతనే గుర్తుపట్టి పలకరించాడు. రంగాచారికి ఐదుగురు సంతానంట. పెద్దవాడు స్కూల్‌ఫైనల్. రంగాచారి ఎలక్ట్రికల్ ఇంజనీరు. భార్యకేదో జబ్బు. హాస్పిటల్‌లో ఎడ్మిట్ చెయ్యడానికొచ్చాడుట. రమాకాంతానికి

దిగులేసింది. అప్పుడే రంగాచారి జీవితంలో ప్రధాన ఘట్టాలు అయిపోయ్యాయి పెండ్లి, పిల్లలు, భార్యకిజబ్బు—చివరిదశల మమకారం జిగురులో అతుక్కుపోయ్యాడు. భార్య జబ్బుగా వుంటే, అతనికి నాట్యాలు, వినోదాలూనా? తనకే భార్యవుంటే ఇట్లాచేసివుండునా? ఉండునేమో, తనేం చెప్పగలడు! సంసారంఅనేది వొక జిగురుబుడ్డి, గాజుది. అందులోంచి లోకం కనబడుతూనే వుంటుంది. కాని అందులోవారు బైటికి రాలేరు. ఏ వొక రిద్దరినో కీర్తికాంత మూత తీసి, పైకి వేళ్లతో కదిపి లాగుతుంది. ఓ క్షణం పైకి నీరసంగా లేచి చేతులు జోడించి, మంచంమీద మూలుగుతూవున్న భార్యకాలు గోకి 'చూడ' మని సంజ్ఞచేసి, మళ్ళీ లోపలికి జారిపోతాడు. కాలం బిరడా బిగిస్తుంది. చరిత్ర వొక్కతాపు తన్ని సీసా పగలగొట్టి, గాజుపెంకుల్ని పొడుంచేసి, చరిత్రపుటల కాగితాలకి వాడుకుని, భవిష్యత్తుకి అమ్మివేస్తుంది. రంగాచారి చెప్పాడు, వాళ్ళస్నేహితుడు కోటేశ్వరరావుకి సంతానం కలగలేదట. యాత్రలుచేస్తూ కాలంగడుపుతున్నాడుట. పిల్లలు లేకపోతే, భవిష్యత్తుకి యిచ్చేటందుకేముంది? భార్య లేకపోతే వర్తమానమే వుండదు. రమాకాంతం గుండెల్లో ఏదో ఆందోళన. తనకి ప్రపంచచరిత్రలో స్థానంలేదు. జరిగిపోయినవి తన జ్ఞాపకంలో వున్నాయి కాని జరిగిన తార్కాణ బాహ్యజగత్తులో లేదు. తనకి వర్తమానంలేదు. భవిష్యత్తులేదు. స్త్రీలోనుంచి ఉద్భవించే శక్తి తనలో లేదు. ఆ శక్తిని వూహించి వూహించి తాను కృశించాడు. ఎందరి స్త్రీల చేతిగాజుల

చప్పుడో చెవుల్లో గింగురుమంటోంది. అతని నుదిటిమీాద మహారాణుల స్థనాలు బరువుగా పడి, మొనలతో కళ్ళమీాద పొడుస్తున్నాయి. ఊహాలో ఎంతటి పారవశ్యత!

"రండి వెడదాం."

అతన్ని అండీ అని సంబోధిస్తున్నాడు రంగాచార్యులు. చిన్నప్పుడు 'వొరే', అనుకునేవాళ్ళు. కాలంకప్పిన మర్యాద శాలువలోంచి ఆ కంఠం.

"రామ్మూర్తిగారమ్మాయి 'రమ' నాట్యం వుంది ఇంటర్వల్ అవగానే" అన్నాడు.

"రామ్మూర్తిగారెవరు?"

"మీాకు తెలియదా ? 'రమ' చాలా అందమైంది. గొప్పగా పాడుతుంది; నాట్యంచేస్తుంది. ఇక్కడ ఆ పిల్లని గురించి తెగచెప్పుకుంటారు."

లోపలికెళ్లారు తెరలేచింది. 'రమ' నాట్యం మొదలెట్టింది. 'రమ' పదిహేనేళ్ళపిల్ల. అవయావాలన్నీ పూర్తిగా వికసించి ఏర్పడలేదు. సగం సగం యివ్వనంలోని లాలన, బాల్యంలోని అమాయకత్వం. పిడుగు భూమిలోంచి చొచ్చుకునిపోయి, అవతలవైపునుండి బైటికి శూన్యంలోకి దూసుకుపోయినట్లు కదలికలో ఆ వేగిరపాటు రమాకాంతాన్ని ముగ్ధుణ్ణి చేసింది. చిన్నప్పుడు స్త్రీలు అంత అందంగా వుంటారా? తను చూసిన కన్యల్ని స్మరించుకున్నాడు. ఒక్కళ్ళూ నిండుగాలేరు. సగంసగం ఎదిగినవాళ్ళు. మొగాడి చేతులో మట్టిముద్దలు. ఏదో తలకాయ, కాళ్ళు, చేతులు,

చూచాయగా సూచించే ముద్దలకింద వుంటాయి. అతను దానికి ఆకారాన్నివ్వాలి—లేకపోతే అంతే. అతనిలో ఆకారాన్నిచ్చేశక్తి పొగమంచులా లేస్తోంది. ఈ స్త్రీలందరూ రంగుల మట్టిముద్దలు. ఈ పురుషుల చేతుల్లోపడి, స్వరూపాలు తెచ్చుకుంటున్నారు. అక్కడ పీక, యిక్కడ పిరుదలు, ఆమధ్య స్థనాలు, చిత్రికపట్టినట్లు నాజూకైన నడుం, పిల్లలకో, వేగంగా కదిలే నదిగట్లులను కోసేసినట్లు వెడల్పైన నడుం—ఆ ముడతలు, జారినచర్మం, నాగరికత మెలుగులు.

"బాగుంది కదూ."

అదరిపడ్డాడు రమాకాంతం.

ఆ అమ్మాయిపేరు 'రమ' అవడం అతనికి మరీ నచ్చింది. రమలాంటిపిల్ల అతనికి దొరుకుతుందా? అతని వయస్సు ముప్పైఏడా? ఆమెకి పదిహేనా? ఆ అమ్మాయి వయస్సు, పాతిక అవుతే ఎంత బాగుండును!

"అవునవును."

అర్థంలేని వ్యాఖ్యానాలు. ఏవేవో ఆలోచనలు. ఆ నాట్యంతో లయకలుపుతున్నట్లు అతని గుండెలు కొట్టుకున్న చప్పుడు వినబడుతోంది. తెరపడింది. చప్పట్లు, కలకలం.

మళ్ళా అసలు బృందంవారి నాట్యాలు. ఏడీ రంగాచారి? వెళ్ళిపోయినట్లున్నాడు, కనబడడేం?

గంటా యిట్టే గడచిపోయింది. ముందు సోఫాల్లో కూర్చున్నపెద్దలు, స్టేజిమీదికి వెళ్ళి, నాట్యంవాళ్ళని అభినందిస్తున్నారు. వారివెనక తనూ వెళ్ళాడు. అదుగో మూలగా

'రమ'. తనూ వెళ్ళి అభినందించాడు. ఆశ్చర్యంతో స్వీకరించింది.

"అద్భుతం, నే నెప్పుడూ చూళ్ళేదు..."అన్నాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. ప్రక్కన నౌకరున్నాడు. రామ్మూర్తిగారమ్మాయిట. రామ్మూర్తిగారి ఇంటి అడ్రెసు అడిగాడు. నౌకరు చెప్పాడు.

'మమ్మీ' అంది 'రమ' ఎవర్నో చూసి. వెనక్కి తిరిగాడు రమాకాంతం. ఆ వొస్తున్న ఆమెని చూసి ఆశ్చర్యపడ్డాడు. ఆమెను చూడకుండా తప్పుకోవాలనుకున్నాడు. కాని ఆమె వొచ్చి పలకరించింది.ఆమె బారిస్టర్ గారమ్మాయి.నాగలక్ష్మి. ఆమె కూతురు 'రమ !'

"ఓ, — ఎప్పుడొచ్చారు?"

"........."

"ఇప్పు డిక్కడుంటున్నారా?"

తల పంకించాడు.

"అమ్మాయి నాట్యం బాగుందా?"

"చాలా."

"అదుగో మావారు—అటు, ఆ సైడ్ కర్టెన్లో...పరిచయం చెయ్యనా?"

"నా డాన్స్ చాలా గొప్పగావుందన్నారు." అన్నది రమ.

"రేపు టీకి రాకూడదూ?"

"తప్పకుండా వొస్తాను."

"ఎక్కడుంటున్నారు. అడ్రెసివ్వండి, మా కారు పంపు తాను, మీరూ ఆమెకూడా వొద్దురు గాని."

"అక్కర్లేదు... లెం......"

ఇంతలో మరో బృందం అభినందనలతో చుట్టు ముట్టారు. అతను దూరంగా వెళ్ళి నాగలక్ష్మిని చూస్తున్నాడు. రమ చక్కదనం అంతా వాళ్ళమ్మదే—కళ్ళల్లో నలుపుమధ్య తేలిపోయిన రంగుతోసహా. నాగలక్ష్మి ఎంత పెద్దదైంది! ఆమెతో సరిపోల్చి చూసుకుంటే తనెంత పెద్దవాడయ్యాడో! సంసారం, పిల్లలు లేకుండా, శరీరాన్ని ఖర్చు చెయ్యకుండా, వున్నాకూడా పెద్దవాడు కావడం మాత్రం ఆగదుకదా! పద హారుగురు సంతానంగల రాఘునమ్మ, పిల్లలు లేని పంకజం— ఇద్దరూ కాలం వూపిన ఉయ్యాలలోంచి వూడిపడాల్సిందే!

చీర జరీకొంగు దీపాలవెలుగులో ధగధగ మెరుస్తోంది. ఆ వెలుగు ఆమె మొహానపడి, నీళ్ళల్లో సూర్యకిరణం వేసిన నీడవెలుగు తిరిగి మొహంమీదపడినట్లు, ఆ మెరిసే అందం ఆకులమధ్యగా ప్రసరించిన వెన్నెలకిమల్లే కవ్విస్తూ పోతోంది. అది అందమా ? కాదు, సంపూర్ణమైన వికాసంపొందిన స్త్రీ మూర్తి పరిపక్వమైన లావణ్యం, తృప్తినుండి జనించే శృంగార ఛాయ. 'మీరు, ఆమెకూడా వొద్దురుగాని' అందేమిటి ? ఆమెవరు? తనకి పెండ్లయివుంటుందని ఆమె తీర్మానించు కున్నందుకు నవ్వొస్తుంది. 'అక్కర్లేదు లెం..." దనబోయి, దిగమింగేశాడు. ఆమెను, తనకి భార్యఅయివుండెడి ఆమెను,

'అండి' అనడం అతనికి చేతకాలేదు. ఆమె అట్లా అనడం సహజం.

జనంమధ్యలో, పూలదండ్లరంగులమధ్యలో 'రమ' కనబడటంలేదు. 'రమ' అన్న పేరు కూతురుకి ఎందుకు పెట్టిందో నాగలక్ష్మి—తన పేరు స్మరణలో పల్చగా దూరమై పోతున్న జ్ఞాపకాల నీడల సూచనా ?

రాత్రంతా నిద్రపోలేదు. రమాకాంతం రామ్మూర్తిని దగ్గరగా చూశ్లేదు. అతని పరిచయాన్ని కిష్టపడలేదు. అదంతా అసూయేనా? వారితో అతని సంబంధం ఏమిటి? 'కొంచెం మెల్లకన్నేమో' అన్న కొన్నిధ్వనులతో ఆమె జీవితంపై మొత్తంగా నిర్ణయం జరిగిపోయింది. న్యాయమూర్తిగా తీర్పు చెప్పాడు తాను. జీవితాంతం కారాగారశిక్ష వేశాడు. కాపలావాడు రామ్మూర్తి. కాని తీర్పు అతనే చెప్పినా, శిక్ష కూడా అతనే అనుభవించడంలాగైంది చివరకు. ఊరికే, యథాలాపంగా అన్న నాలుగైదక్షరాలకు అంతటిప్రభావం వుంటుందని రమాకాంతం ఎప్పుడూ అనుకోలేదు.

బీచమ్మట వొంటిగా షికారెళ్లాడు. ఆ ఇసుకలో సముద్రంకేసి చూస్తూ పడున్నాడు. సముద్రంలోతుల్లోంచి కెరటాలు వుప్పొంగి నేలమీదపడి, నురగలై రోదిస్తున్నాయి. వాటికి తన హృదయానికిమల్లేనే, స్థిరమైన ఉనికి లేదు— స్థావరంలేదు. ఇల్లులేదు. లంగరులేదు. ఎగిరి ఎగిరిపడటం— తుంపరలై ఒకదాన్ని ఒకటి వెదుక్కుంటూ మళ్ళా ఆ లోతుల్లోకి పారిపోవడం. ఈ ఆటకి అంతులేదు. లేకేమి? ఒకప్పుడు,

జీవకోటి పుట్టనప్పుడు, సృష్టి ప్రారంభించనప్పుడు, అసలు సముద్రమే లేదు. వేడి వాయువుల ముద్ద యీ భూగోళం. అంతే ప్రాణికూడా. పుట్టగానే నెత్తుటిముద్ద, పెరిగి పెద్దదై, ఆకృతి తెచ్చుకుని, భావాలు, వాంఛలు, కలలు పిల్లకెర టాలై, మాటలు చేష్టలు నురగలై, మళ్ళా వొకదానికొకటి సమన్వయం కుదుర్చుకుంటూ మట్టిముద్దయిపోవడమేనా! ఎప్పుడో చంద్రుడు ఆకర్షణకి ముందుకొస్తాడు. సముద్రం అంతా లేచి తిరుగాడుతుంది. సూర్యుడు వెనక్కి వెడతాడు. సముద్రం గడ్డగడుతుంది. మళ్ళా భూగోళం మంచుముద్దగా, ప్రాణి రహితంగా పరిభ్రమిస్తుంది.

అన్నీ గోళాలు—స్త్రీల రొమ్ములు. పరిభ్రమిస్తూ వుంటాయి. పురుషుడి గుండెకాయ ఒకగోళం. అదీ దేని కోసమో కొట్టుకుంటూ వుంటుంది. ఆ స్థానాలమధ్య, యీ గుండెకాయ, త్రిమూర్తి నాట్యంకాక మరేమిటి?

రమాకాంతం ఆలోచనల వెనక ఏదో వుందని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు. వాటివెనక రమ వుంది. ఆమె వెనక ఆమె తల్లి వుంది. వారిద్దరి వెనక తను వున్నాడు. తన కేం కావాలి? 'రమ.'

మర్నాడు రామ్మూర్తిగారింటికి కెళ్లాడు.

గేటుతీసి లోపలికెళ్ళగానే నల్లటి బొచ్చుకుక్క మొరుగుతూ మీదికొచ్చింది. తోటమాలి దాన్ని బుజ్జగించి ఊరుకోబెట్టాడు. వరండాలో సోఫాసెట్టుంది. మూలగావున్న పెద్దకుర్చీలో కూర్చున్నాడు. మధ్య టేబిల్ మీద పత్రిక

లున్నాయి. చూస్తున్నాడు హాల్లో గోడగడియారం తొమ్మిది కొట్టింది. నాగలక్ష్మి గుమ్మంలో నుంచుంది.

"ఇల్లా రండి."

లేచి లోపలికెళ్లాడు. అది డ్రాయింగ్ రూమ్. మధ్య పెద్దబల్ల. ఫ్లవర్ వాస్—సైడ్ బోర్డ్. గిల్ట్ ఫ్రేమ్‌లలో తగల్చిన 'లంబాడీ స్త్రీ' 'సంతాల్ నృత్యం' జెమినిరాయ్ 'గోపిక' తైలవర్ణ చిత్రాలు అమర్చివున్నాయి.

"ఆమెను తీసుకురాలేదేం ?" అన్నది నాగలక్ష్మి.

"నాకింకా పెండ్లి కాలేదుగా" ఆశ్చర్యం ప్రకటించింది.

"అల్లాగా, అవునవును—మీ కసలు పెండ్లి చేసుకోవాలనే లేదేమో!"

"ఏదో అల్లాగైపోయింది."

"నేనూ అంతే, చిన్నప్పుడు. పెండ్లి చేసుకోకూడదనుకునేదాన్ని. మా రమా అంతే. పెండ్లి విషయం తలబెడితే చీదరించుకుని, రెండురోజులవరకూ అసలు మాట్లాడనే మాట్లాడదు."

ఎర్రబోర్డరు ఖాదీచీర వేసుకుంది, నాగలక్ష్మి—పల్చటి చీరైనా, నాజూకుగా లేదు. చేతికి ఎర్రగాజులు—మధ్య వెడల్పైన బంగారు 'బ్రేస్‌లెట్'—చేప ఆకారం కుంకుమబొట్టు, పల్చటి కాటుకఛాయ. జుట్టు మెలితిప్పి బర్మా ముడిలా పైకిలాగి అమర్చివుంది. చిరు వెంట్రుకలు మెడచుట్టూ వుంగరాలుగా మూశాయి. కొప్పుమధ్యలో ఎర్రపూలు.

జరీబోర్డరు తెలుపు ఖాదీజాకెట్టు—అంచుకింద పొట్ట గీతలా మడతపడింది.

"ఇంతకీ మీ రేంచేస్తున్నారు?"

"ఏమీలేదు."

"బొత్తిగా ఏమీలేదా?"

"అవును."

"పెళ్ళి, ఉద్యోగం రెండూకూడా వుండకూడదను కున్నారా?"

నవ్వింది. సినిమాస్కోప్‌లో మొక్కజొన్న పొత్తిలా పళ్ళు మెరుస్తున్నాయి. 'రమ' తల్లి అన్నసంగతి మరిచిపో గలిగితే నాగలక్ష్మి అంత పెద్దదానిగా కనబడకపోను అను కున్నాడు రమాకాంతం. నాగలక్ష్మి కళ్ళకింద, వర్షానికి ఎండి బీటలుతీసిన భూమిలోలా, సన్నటిగీతలు చర్మాన్ని వెదు క్కుంటూ, పీడిస్తున్నాయి. జుట్టులో తెల్లవెంట్రుకలు, మధ్య మధ్య 'మేమూ వున్నా'మంటూ, కన్నుగీటుతున్నట్లున్నాయి.

"కావాలనుకున్నంత మాత్రాన అవి లభించాలని లేదుగా" అన్నాడు.

"టిఫిన్ తీసుకురానా?"

లోపలికెళ్ళింది. వొంటాయన బల్లమీంద తినేవి సిద్ధం చేశాడు, వదినిమిషాలయ్యాక నాగలక్ష్మి వొచ్చింది.

"నే నీ వూరు అసలు ఉద్యోగంకోసమే వొచ్చాను." అన్నాడు.

"అల్లాగా. మీకింకా ఉద్యోగం చూసుకునే అవసరం వుంటుందనుకోలేదు. మీకేదో మంచి ఆస్తివుందనుకునేవారు."

"అవును. మా నాయనగారు పక్షవాతంవల్ల చని పొయ్యారు. చాలాభాగం ఖర్చయిపోయింది ఎప్పుడో" అన్నాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. తన పాదాలకేసి చూసు కుంటోంది. తెల్ల రబ్బరుస్లిప్పర్స్‌పైన, నల్లతాళ్లుగల గ్రీక్ మోడల్ సాండల్స్ అవి.

"ఆస్తుల తీరువే అంత—పోతూంటాయి, వొస్తూ వుంటాయి." అంది.

"రేపే ఇంటర్వ్యూ."

"ఏం ఉద్యోగం?"

ఫలానా అని చెప్పాడు. ఇంటర్వ్యూ జరిగే ఆఫీసు పేరుకూడా చెప్పాడు,

"ఓ!" అందామె.

"మనం అనుకున్నట్లు జరగవు కదూ!" అన్నాడు. ఎందు కట్లాగన్నాడో స్పష్టంగా అతనికే తెలవదు.

"జరక్కపోవడం వొకటి. జరిగితే అల్లాజరిగిందే అని బాధపడటం మరొకటి" అని నవ్వింది.

ఇంతలో నౌకరొచ్చాడు.

"అమ్మాయిగార్ని దించేసింతర్వాత, కారు తీసుకు రమ్మన్నారండి అయ్యగారు" అన్నాడు నౌకరు.

"అసలు అమ్మాయిగారు ఇంటికే రాందే" అంది నాగలక్ష్మి.

నౌకరు దూరంగా వెళ్ళాడు.

"ఇవాళ పార్టీ హడావుడికదూ, స్నేహితుల్ని ఆహ్వానించేటందుకు ప్రొద్దుననగా వెళ్ళింది. ఇవాళకి డాన్సుపాఠం సున్నా. సాయంత్రం పార్టీకి వొస్తున్నారుగా. మీరు చాలా మెచ్చుకున్నారటగా..."

"అవును. చాలా అద్భుతంగా వుంది."

"చిన్నవాళ్ళు ఏదిచేసినా మెచ్చుకుంటూ వుంటారు లెండి. కాస్తంత పెద్దదై పేరుతెచ్చుకున్నాక ఈర్ష్యలు, స్పర్థలు, మంచిచెడ్డలు బైటపడతాయికదూ?"

"అవన్నీ అసలు కొంత సరుకంటూ వున్నమీదనేగా. అన్నింటికంటె ముఖ్యమైంది మరొకటుంది. ఎన్నివున్నా నాట్యంచేసేవారికి చక్కదనం లేకపోతే రాణించదు."

"నాట్యంచేసేవారికే అన్నమాటేమిటండి. ఎవరికేనా సరే, స్త్రీకి చక్కదనం వుండితీరాలిగా—యీరోజుల్లో అది మరీ అవసరం—మొగాళ్ళకికూడా చక్కదనం వుండాలని కోరుతున్నప్పుడు, స్త్రీలకుండాలనడంలో అబ్బురం ఏముంది లెండి." అంది. నవ్వుని ఆపుకుంటున్నట్లు పెదవులు ముడుచుకుంటున్నాయి. రమాకాంతం ఈ ప్రశంస వొచ్చినందుకు దిగులుపడ్డాడు—నోవిధంగా ఇదిరావడం అతను లోపలకావాలనుకున్నదే. ఏమిటో ఆ దిగులులోకూడా కాస్త సంతోషం.

"రమ చాలా అందమైంది."

"మీరు మెచ్చుకుంటే అందమైందనే వొప్పుకోవాలి. ఓ పట్టాన మీకెవ్వరూ నచ్చరుగా" అంది. ఆపుకునే పెనుగులాటమాని పెదవులు విచ్చలవిడిగా విడిపోయి నవ్వుని మెల్లమెల్లగా ప్రదర్శింపచేశాయి, ఒకటిరెండు చినుకులతో ప్రారంభమై, చటుక్కున పెద్ద జల్లుగాపడి, క్షణంలో నిలిచిపోయినట్లు. యిద్దరూ నవ్వి, మౌనంలో పడ్డారు.

"రమ అంతా మీ పోలికే." అన్నాడు.

"కానేకాదు. అల్లాగంటే వొప్పుకోనుస్మాండి. వాళ్ళ నాన్న పోలికే అంటారు అందరూను, చూశారుగా."

"రాత్రి దూరంగా ఆ జనంలో అంత బాగా పరకాయించి చూళ్ళేదు."

-రండి, ఫొటో చూద్దురుగాని."

ఇద్దరూ స్టడీరూమ్‌లో కెళ్ళారు. గోడనివున్న ఫొటో చూశాడు- రామ్మూర్తి, ఆడపిల్లని ఎత్తుకున్న నాగలక్ష్మిని-పన్నెండేళ్ళనాటిది—తను బాగా ఎరుగున్న నాగలక్ష్మి—కొంచెం తెలిపోయిన నలుపు కంటిపాప ఫొటోలో కనిపిస్తూవుంది. రామ్మూర్తికి మీసాలున్నాయి. ఫొటోలో బాగా లావుగా కనిపించాడు.

"ఇప్పుడంత లావులేరు.చిక్కారు. ఎలర్జిక్ కండిషన్‌ట, బ్రాంకైటీస్ అంటున్నారు డాక్టర్లు. ఇప్పుడు చెప్పండి—"

"చెప్పలేం- ఇద్దరిపోలికలూ వుంటాయి" అన్నాడు.

వెడతానని లేచాడు రమాకాంతం.

"కాసేపుండరాదు. అమ్మాయొస్తుంది, కార్లో వెడు దురుగాని బసకు."

"లేదు. ఇంకా ఒకరిద్దర్ని చూడాలి. ఇంటర్వ్యూకి కావల్సిన భోగట్టా పోగుచెయ్యాలిగా."

మళ్ళా వరండాలోకొచ్చాడు. అప్రయత్నంగా అతని కళ్ళు తడయినట్లు రుమాలుతో తుడుచుకుంటున్నాడు.

"మరి...ఉండనా..."

"సాయంత్రం తప్పకుండా రావాలి. లేకపోతే రమ వూరుకోదు."

"రమ అంతగా అన్నదా!"

"అవును. పిల్లలదేగా సర్దాఅంతా."

తటపటాయించాడు. రెండడుగులు ముందుకేశాడు.

"లక్ష్మి—సాహసించి నిన్నొకటి అడగాలనుకుంటున్నాను."

ఆమెకేసి చూడలేక మొహం పక్కకి తిప్పేశాడు రమాకాంతం.

"సాహసం కావల్సివొచ్చేదైతే అడగొద్దుస్మా."

అని నవ్వింది నాగలక్ష్మి.

మరో రెండడుగులు ముందుకేశాడు.

"అంటే, అడగడం నాకంత సులువుకాదు."

"మీా రడగొద్దు, నాకు తెలుసు."

వెళ్ళాడు. ముందు మెల్లగా నడవడం సాగించాడు. ఎవరో వెనకనుండి పిలుస్తుంటే ఆగిపోవడానికి ఎదురుచూస్తున్న వాడిలాగా. తర్వాత అతివేగంగా నడిచాడు. గేటుదగ్గర కొచ్చాడు. మళ్ళా ఆ బొచ్చుకుక్క మీదికొచ్చింది. తోట మాలి దాన్ని బుజ్జగించి తీసుకెళ్ళాడు. గేటుదాటి ఇంటివైపు చూశాడు రమాకాంతం. తలుపులు వేసున్నాయి.

ఆ సాయంత్రం పార్టీకి రాలేదు రమాకాంతం. మర్నాడు, ఇంటర్వ్యూ అవగానే బైలుదేరి వాళ్ళవూరు వెళ్లాడు. ఇంటర్వ్యూ చేసిన ఉద్యోగి రామ్మూర్తి. ఆ ఉద్యోగంపైన అభిలాష పోయిందతనికి. వేరే ఉద్యోగం చూసుకునేటందుకు సిద్ధపడుతుండగా, నాలుగురోజుల్లో పట్నంనుండి ఉత్తరంవొచ్చింది. ఆ వుద్యోగం అతనికిచ్చినట్లు' ఫలానావూళ్ళో వేసినట్లు వార్త.

తన కా ఉద్యోగం అక్కర్లేదని వ్రాద్దామనుకుంటూ వుండగా మరో కవరొచ్చింది.

నాగలక్ష్మి వ్రాసింది :

"నా చేతనైంది వారితో చెప్పి, ఆ ఉద్యోగం విషయంలో సహాయం చెయ్యగలగడం. నా సహాయమేమీ అక్కర్లేకపోయింది. ఇంటర్వ్యూలో మీరు చాలా తృప్తికరమైన సమాధానాలిచ్చారుట. వొచ్చినవారందరిలో మీరే ఎక్కువ అర్హతగలవారనీ విన్నాను. అందుచేత నేను చేసిందేమీలేదు.

ఇంక రెండోవిషయం.

రమ చిన్నపిల్ల, పెండ్లంటూ చేసుకుంటే తనకి నచ్చిన వాడిని, ఈడూ జోడూ కుదిరినవారిని చేసుకుంటుంది కదా. మనం కోరేదికూడా అదేగా. నచ్చినవారిని చేసుకున్నాక, తరవాత ఏవన్నా వొడుదుడుకులువొస్తే వారే బాధ్యతవహించాలి గాని, తలిదండ్రులమీద, రాతమీద విరుచుకుపడటానికుండదు. మీకు తెలియందేముంది."

రమాకాంతం కళ్ళంట నీళ్ళు కమ్ముకున్నాయి. వేళ్ళతో తొలిగించినకొద్దీ, బొట్లుగా జారుతున్నాయి. యవ్వనంలో వున్నంత వేగం, సాంద్రత, ఉప్పదనం వాటిల్లో లేవని గ్రహించాడు; ఉద్యోగం స్వీకరిస్తూ జవాబు వ్రాశాడు.





## బుచ్చిబాబు

[ శివరాజు వెంకట సుబ్బారావు ]

జననం : ఏలూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

ఎం. ఎ., మదరాసు, నాగపూరు విశ్వవిద్యాలయాల్లో.

1943 - 1945 అనంతపురం, విశాఖపట్నం కళాశాలల్లో ఆంగ్లోపాధ్యాయుడుగా.

1945 నుండి ఆలిండియా రేడియోలో.

అచ్చుపడిన రచనలు - కథలు : ఐదుకథలు, ఆశాప్రియ, ఆమెనీడ, దేశం నాకిచ్చిన సందేశం, నిరంతరత్రయం, చైతన్యప్రవంతి, నా గాజుమేడ, కాలచక్రం నిలిచింది, జ్ఞాననేత్రం, ఎల్లోరా, కలలోజారిన కన్నీరు.

నాటికలు : ఆత్మవంచన, దారినిపొయ్యే దానయ్యా, ఉత్తమా యిల్లాలు, ఆద్యంతాలు.

నవల : చివరకు మిగిలేది.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.